ఓం

శ్రీ మహాగణాధిపతయే నమః శ్రీ మేథాదక్షిణామూర్తయే నమః
శ్రీ భువనేశ్వరీ దేవ్యై నమః శ్రీ యాజ్ఞవల్క్య గురుభ్యోం నమః

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# చింతా వారి
# యోగాలు, కరణాలు - ప్రయోజనాలు


విశ్వజ్యోతిష సామ్రాట్, స్వర్ణకంకణ సన్మానిత, హానర్ అవార్డు గ్రహీత,
జ్యోతిషవాస్తురత్న, జ్యోతిషశిరోమణి:

**చింతా గోపిశర్మ సిద్ధాంతి**

**లక్ష్మీలలితా వాస్తు జ్యోతిష నిలయం**
డోర్ నెం. 6-1-17, వర్థుల వారి వీధి,
పెద్దాపురం-533 437, తూ॥గో॥జిల్లా.
సెల్: 98661 93557, 99890 88557
E-mail: chintagopisarma@gmail.com
Youtube: chintagopisarma & jatakadarshini
Whatsapp: 98661 93557

# యోగాలు, కరణాలు - ప్రయోజనాలు

హైందవ జీవనంలో పంచాంగం యొక్క ప్రాముఖ్యత అనన్య మైనది. గతంలో నిత్యకృత్యాల నుండి విశేష కార్యక్రమాల వరకు అన్నీ పంచాంగం ఆధారంగా నిర్ణయించుకుని ముందుకు సాగేవారు. ఆధునిక కాలంలో పంచాంగంలోని తిథి, వారం, నక్షత్రం – వీటికున్న ప్రాముఖ్యత యోగ, కరణాలకు లేకుండాపోయింది. సూర్య, చంద్రుల గమనం ఆధారంగా సాగే మన జీవనగమనంలో పంచాంగంలోని ఐదు అంగాలకు సమాన ప్రాముఖ్యత వున్నా పంచాంగం చూసేవారిలో చాలామందికి యోగ, కరణాల ప్రాధాన్యత తెలియకపోవడం, కొందరు పంచాంగకర్తలు తమ పంచాంగాలలో వాటిని పేర్కొనకపోవడం తదితర కారణాలతో అవి మరుగునపడ్డాయి. శుభతిథిని ఎన్నుకుని పని ప్రారంభిస్తే సంపద, శుభవారం వలన ఆయుష్షు, నక్షత్రం వలన పుణ్యం, యోగం వలన వ్యాధినాశనం, కరణం వల్ల ఇష్టకామ్యం సిద్ధిస్తాయని శాస్త్రవచనం. దీనిని బట్టే తెలుస్తుంది. జన్మజాతకం పరిశీలించే సమయంలో యోగ, కరణాలను తప్పక పరిశీలించవలసి వుంటుందని, అలాగే ముహూర్తనిర్ణయ సమయంలో కూడా వీటిని పరిగణనలోకి తీసుకోవలసి వుంటుందని తిథి, వారం, నక్షత్రం కలిసే సరికే ముహూర్తం సంఖ్య చాలా పరిమితమైపోతుంది. ఇక యోగ, కరణాలు కూడా కలవాలంటే సరైన ముహూర్తం దొరకటం అసాధ్యమే అన్నది కొందరి వాదన. కరణం, యోగం అంటే ఏమిటి? వాటి వల్ల జాతకంలో ఏమి తెలుసుకోవచ్చు? ముహూర్త నిర్ణయంలో యోగ, కరణాలను కూడా పరిగణనలోకి తీసుకుంటే కలిగే ప్రయోజనాలు ఏమిటన్నది వివరించటమే ఈ వ్యాసం లక్ష్యం.

**యోగము:** సూర్య, చంద్రుల గత ఆధారంగా గుర్తించే రోజులోని ప్రత్యేక సమయం యోగం. 360 డిగ్రీల వృత్తంలో ఒక్కొక్కటి $13^{0}-2'$

వంతున మొత్తం 27 యోగాలుగా గుర్తించారు. నిరాయన పద్ధతిలో చంద్రుని దీర్ఘాంశలు (డిగ్రీలలో) సూర్యుని దీర్ఘాంశలు (డిగ్రీలు) గుర్తించి రెండికిని కలపగా వచ్చే డిగ్రీల ఆధారంగా యోగం గుర్తించాలి. ఇది 360కి మించితే, దీర్ఘాంశం మొత్తం నుండి 360 తీసివేయగా వచ్చిన మొత్తంతో అప్పటి యోగం (డిగ్రీల ఆధారం) గుర్తించాలి.

| | | |
|---|---|---|
| చంద్రుని దీర్ఘాంశలు | : | $11^0$-$38^{\prime}$ |
| సూర్యుని దీర్ఘాంశలు | : | $287^0$-$57^{\prime}$ |
| | | ------- |
| మొత్తం | : | $299^0$-$35^{\prime}$ / $13^0$-$25^{\prime}$ |
| | | ------- |
| | | 24 యోగాలు + $6^0$-$15^{\prime}$ |

**25వ యోగం - శుభయోగము.**

**ఉదా:** ది. 01-02-2020 సాయంత్రం గం. 05-30 ని॥లకు యోగము కనుగొనడం.

| | | |
|---|---|---|
| చంద్రుని దీర్ఘాంశలు | : | $153^0$-$38^{\prime}$ |
| సూర్యుని దీర్ఘాంశలు | : | $270^0$-$39^{\prime}$ |
| | | -------- |
| | | $424^0$-$17^{\prime}$ |
| (–) | | $360^0$-$00^{\prime}$ |
| | | ------- |
| మొత్తం | : | $64^0$-$17^{\prime}$ / $13^0$-$20^{\prime}$ |
| | | = 4 యోగములు + $10^0$-$57^{\prime}$ |

**5వ యోగం - శోభన యోగము.**

**యోగములు - సూర్యచంద్రుల మొత్తం దీర్ఘాంశలు (డిగ్రీలలో) వివరములు తెలుపు పట్టిక:-**

| యోగము | డిగ్రీల నుండి... | డిగ్రీల వరకు |
|---|---|---|
| 1. విష్కంభము | $0^{0}-00^{'}$ | $13^{0}-20^{'}$ |
| 2. ప్రీతి | $13^{0}-21^{'}$ | $26^{0}-40^{'}$ |
| 3. ఆయుష్మాన్ | $26^{0}-41^{'}$ | $40^{0}-00^{'}$ |
| 4. సౌభాగ్యము | $40^{0}-01^{'}$ | $53^{0}-20^{'}$ |
| 5. శోభనము | $53^{0}-21^{'}$ | $66^{0}-40^{'}$ |
| 6. అతిగండము | $66^{0}-41^{'}$ | $80^{0}-00^{'}$ |
| 7. సుకర్మము | $80^{0}-01^{'}$ | $93^{0}-20^{'}$ |
| 8. ధృతి | $93^{0}-21^{'}$ | $106^{0}-40^{'}$ |
| 9. శూలము | $106^{0}-41^{'}$ | $120^{0}-00^{'}$ |
| 10. గండము | $120^{0}-01^{'}$ | $133^{0}-20^{'}$ |
| 11. వృద్ధి | $133^{0}-21^{'}$ | $146^{0}-40^{'}$ |
| 12. ధ్రువము | $146^{0}-41^{'}$ | $160^{0}-00^{'}$ |
| 13. వ్యాఘాతము | $160^{0}-01^{'}$ | $173^{0}-00^{'}$ |
| 14. హర్షణము | $173^{0}-21^{'}$ | $186^{0}-40^{'}$ |
| 15. వజ్రము | $186^{0}-41^{'}$ | $13^{0}-20^{'}$ |
| 16. సిద్ధి | $200^{0}-01^{'}$ | $213^{0}-20^{'}$ |
| 17. వ్యతీపాతము | $213^{0}-21^{'}$ | $226^{0}-40^{'}$ |
| 18. వరీయాన్ | $226^{0}-41^{'}$ | $240^{0}-00^{'}$ |
| 19. పరిఘ | $240^{0}-01^{'}$ | $253^{0}-20^{'}$ |
| 20. శివము | $253^{0}-21^{'}$ | $266^{0}-40^{'}$ |
| 21. సిద్ధము | $266^{0}-41^{'}$ | $280^{0}-00^{'}$ |
| 22. సాధ్యము | $280^{0}-01^{'}$ | $293^{0}-20^{'}$ |
| 23. శుభము | $293^{0}-21^{'}$ | $306^{0}-40^{'}$ |
| 24. శుక్లము | $306^{0}-41^{'}$ | $320^{0}-00^{'}$ |
| 25. బ్రహ్మము | $320^{0}-01^{'}$ | $333^{0}-20^{'}$ |
| 26. ఐంద్రము | $333^{0}-21^{'}$ | $346^{0}-40^{'}$ |
| 27. వైధృతి | $346^{0}-41^{'}$ | $360^{0}-00^{'}$ |

ఆయా యోగముల యందు ఏమీ పనులు చేపట్టవచ్చు? ఏయే పనులు చేపట్టకూడదు? ఆయా యోగముల యందు జన్మించిన వారి లక్షణములు ఎలా వుంటాయి? మొదలైన వివరాలు ఇప్పుడు తెలుసుకుందాం.

## యోగములు - చేయతగిన పనులు

1. **విష్కంభము (3వ ఘడియ త్యాజ్యము)**: చౌలము, విత్తనములు నాటుట, స్త్రీ సంగమము, దంత కల్పనము, వడ్రంగం పనులు ప్రారంభము, శత్రువులను వెళ్ళగొట్టుటకు మంచిది.
2. **ప్రీతి**: స్నేహం, అలంకరణ – ధారణ, భూక్రయం, రాజవశ్యం, ఉత్సాహమైన పనులు చేయుటకు మేలైనది.
3. **ఆయుష్మాన్**: బీజావాపనం, ఋణం చేయుటకు, పౌష్టిక క్రియలు, ఔషధసేవనం, వివాహం, ఉపనయనములు.
4. **సౌభాగ్యము**: నూతన వస్త్రధారణ, అలంకరణ, సౌభాగ్య కర్మలు, సోమ–సురాపానములు.
5. **శోభనం**: పదవీ స్వీకారం, వివాహం, దానములు, ఆయుర్వృద్ధి కర్మలు, భూ–స్థల క్రయములకు శుభకరణము.
6. **అతిగండం**: యుద్ధము, నిగ్రహము, దోదనం, వధ, బంధనం, వృక్షచ్ఛేదన, వంచన క్రియలు, క్షుద్రకర్మ క్రియలు.
7. **సుకర్మ**: చిత్రలేఖనం, గృహారంభం, పట్టాభిషేకం, భూ ఆర్జన, మంగళకరమైన పనులు చేయుటకు మేలైనది.
8. **ధృతి**: దేవాలయ, గృహనిర్మాణం; ప్రాకార, వంతెన, తోరణాది నిర్మాణములు.
9. **శూల (5వ ఘడియ త్యాజ్యము)**: క్రూర, మారణ, దహన, శత్రు సంహారక క్రియలు, బంధన అవమాన క్రియలు.
10. **గండశి (6వ ఘడియ త్యాజ్యము)**: యుద్ధ, శత్రు సంహరణ ములు, సేతు–భూ సంస్కరణాదులు.

11. **వృద్ధి**: వివాహ, తటాక, ధనగ్రహణ, సేతుబంధన, భీజవాపనం, వస్త్రధారణలు.

12. **ధృవము**: వస్త్ర, రత్న-ధారణ, గృహారంభం, తటాక సేతు బంధన, అలంకరణాదులు.

13. **వ్యాఘాతక (9వ ఘడియ త్యాజ్యము)**: బంధన, రోధన, ఘాతనము, చేదన, క్రూర కర్మలు చేయుటకు మేలైనది.

14. **హర్షం**: వివాహాదులు, శుభకర్మలు, ఆయుష్కర్మలు, భూసంపాదన, వాహనారోహణ, వస్త్రధారణలకు ఉత్తమము.

15. **వజ్రము (3వ ఘడియ త్యాజ్యము)**: సౌమ్య కర్మలు, ఆయుధ ధారణలకు మేలైనది.

16. **సిద్ధి**: ఉంగరములు, హస్తాభరణములు, కంఠాభరణములు, మొలత్రాడు ధరించుటకు.

17. **వ్యతీపాత (శుభకర్మలు పూర్తి త్యాజ్యము)**: శ్రాద్ధ క్రియలు, దానములు, శుభకర్మలు చేయరాదు - మృత్యుప్రదము. దానములు చేయుటకు శుభకరమైనది. ఉచ్చాటన, విషప్రయోగములు, విషహరణ క్రియలు చేపట్ట వచ్చును.

18. **వరీయాన్:** హారములు, వస్త్రాభరణములు, ఉంగరములు, మొలత్రాడు కట్టుటకు

19. **పరిఘ (పూర్వార్థము త్యాజ్యము)**: బంధనము, చేదనము, క్రూరకర్మలు, విషప్రయోగములు చేయవలెను.

20. **శివం**: పుష్పమాలలు, కంఠమాలలు, కర్మభూషణములు, కటి సూత్రములు, గజ్జెలు తదితర అలంకారములకు మేలు.

21. **సిద్ధి**: దేవతాప్రతిష్ఠలు, గృహారంభం, నగర, ప్రాకారాది, తోరణాది నిర్మాణములకు.

22. **సాధ్యం**: దేవ, గురుపూజ, సరస్వతీపూజ, మంత్రదీక్షలు.

23. **శుభం**: గృహారంభ, ప్రవేశములు, విత్తనములు నాటుట, సర్వరత్నధారణ, భూమిని కొనుట, ధన, ధాన్య సంగ్రహణ.

**24.** **శుక్ల**: కన్యాదానం, భూషణం, లేపనం.

**25.** **బ్రహ్మ**: గ్రహశాంతులు, రోగశాంతులు, ఉపనయనం, చౌలం, క్షౌరం.

**26.** **ఐంద్ర**: స్త్రీ సంగమం, గజారోహణ, కావ్య, నాటక, గాన విద్యలు నేర్చుటకు.

**27.** **వైధృతి**: హింసించటం, పరరాష్ట్ర వంచన, తగులపెట్టుట, క్రూర కర్మలు చేయుటకు.

## యోగములు - జనన ఫలితములు

**1.** **విష్కంభ**: పుత్రులు, మిత్రులు, కళత్రమూలకంగా సుఖవంతులగుదురు. సర్వకార్యాచరణాలలోనూ స్వాతంత్ర్య భావములు కలిగియుందురు. శరీర సౌష్టవాది విషయములకు ప్రాధాన్యత ఇస్తారు.

**2.** **ప్రీతి**: మంచి వక్తలు, సౌందర్యవంతులు, సంపదలతో తులతూగుతారు. దాతలు, ప్రసన్నవదనలు, సద్వినోదమలన్న ప్రీతి, ఆనందము పొందుతారు. ధార్మికులు.

**3.** **ఆయుష్మాన్:** అర్థార్జనా తత్పరత కలవారు. ప్రయాణముల యందు, ఉద్యానవన సీమలయందు విహారములనిన ప్రీతి కలిగి యుందురు. దీర్ఘాయుర్థాయం కలవారు, అభిమానధనులు.

**4.** **సౌభాగ్య**: జ్ఞానవంతులు, ధనవంతులు, సత్యపరాయణులు, ఆచారశీలురు, శరీరధారుఢ్యం కలవారు, వివేకవంతులు, విశేషమైన సిరిసంపదలతో తులతూగుతారు.

**5.** **శోభన**: సుందర రూపవంతులు, అతిచతురత కలవారు, గౌరవ సంపన్నులు, సుబుద్ధి కలవారలు, అనునిత్యం శుభకార్యాచరణ శీలురైయుందురు.

**6.** **అతిగండ**: సదాగర్వితమతులుగా నుందురు. కంఠరోగము కలుగును. క్రోధపరాయణులు, భారీ శరీరము. వెడల్పైన

పాదములుండును. ధూర్తులు, కలత ప్రియాభిలాషులు, పాషుండులు.

**7.** **సుకర్మ**: సదా సంతోషములతో కూడుకొనియుందురు. సకల కళా విలాసప్రవీణులు, సాహసి, ఉత్సాహభరితులు, పరోప కారులు, సత్కార్యాచరణ శీలురు.

**8.** **ధృతి**: ప్రాజ్ఞులు సదా సంతోషచిత్తులైయుందురు. సభలలో ప్రముఖులుగా నుందురు. చపలచిత్తులు, శీలసంపత్తి కలవారు. నీతిపరులు. నియమనిబంధనలు పాటింతురు, ధైర్యవంతులు.

**9.** **శూల**: దారిద్ర్యములతో బాధపడుదురు. రోగపీడితులు. సత్కార్యా చరణము, విద్యావిషయములందు విరక్తి కలిగియుందురు. శూలరోగాది పీడతులగుదురు.

**10.** **గండయోగము**: ధూర్త స్వభావులు, మిత్రాది కార్యవర్గ విషయములందు నిర్లిప్తత కలిగి యుందురు. తీవ్ర కోప స్వభావులు, క్లేశములతో సతమతమగుదురు, కఠినచిత్తులు.

**11.** **వృద్ధి**: సంపాదనాది విషయలోలురు, వ్యాపారాదులయందు దక్షత, నేర్పరితనం కలిగివుంటారు. భార్యవృద్ధి కలవారు.

**12.** **ధృవ**: అదృష్టశాలురు. వారి ఇంట సదా లక్ష్మీనివాసముండును. వారి ముఖమున సరస్వతి తాండవిస్తుంటుంది. ఉన్నత కీర్తితో అలరారుచుందురు.

**13.** **వ్యాఘాత**: క్రూరులు, అల్పదృష్టితో చూచుచుందురు (ఎదుటి వారిని) దయాదాక్షిణ్యములు ఉండవు. అపవాదములు సృష్టించు చుందురు. అసత్యవాదనలకే ప్రాధాన్యము ఇచ్చుచుందురు. ఇతరులకు కష్టములు కలిగించుదురు.

**14.** **హర్ష**: మూర్తీభవించిన చారుగాత్రులు, శాస్త్రాధ్యయన తత్పరులు, ఎరుపువర్ణ భూషణములు, ఎరుపురంగు వస్త్రధారణ యందాసక్తి కలిగియుందురు. శత్రుమర్ధనులై యుందురు.

**15.** **వజ్ర**: సద్బుద్ధి కలవారు. బాంధవ శ్రేణితోను, సద్గుణములతోను ప్రభావాన్వితులైయుందురు. రత్నశాస్త్రమందు ప్రావీణ్య

ముండును. వజ్ర, మణిమాణిక్యాది భూషణములు కలిగి యుందురు. సత్యపరులు.

**16.** **సిద్ధి**: ఉదార మనస్కులు, చతురత నెరింగియుందురు. సౌశీల్య వంతులు, శాస్త్రానుసార వర్తనులు. పేరు, ప్రతిష్ఠలు కలిగియుందురు. భాగ్యాభివృద్ధి కలవారు.

**17.** **వ్యతీపాత**: ఉదారస్వభావులు, తల్లిదండ్రుల మాటకు విలువనిస్తారు. హృదయం మాత్రం కఠినము. ఇతరుల కార్యములు పాడుచేయుట-సరదా.

**18.** **వరీయాన్**: ధన, భోగపరాయణులు. వినయ స్వభావులు, స్వల్ప ధనము కలిగియుందురు. సద్వ్యయమునే చేయుదురు. నిత్యకార్యాచరణశీలురు. సౌజన్యవంతులు.

**19.** **పరిఘ**: అబద్ధపు, తప్పుడు సాక్ష్యములు చెబుతారు. క్షమాగుణం ఉండదు. ప్రతివారినీ తిరస్కారభావంతో చూస్తారు. సకర్మహితులు. అల్పభక్షణము చేయుదురు. దక్షతకలవారు. శత్రువులకు లొంగి వుందురు. తిరస్కరించదగినవారైయుందురు.

**20.** **శివ**: శుభమైన మాత్రశాస్త్రములందాసక్తి కలిగియుందురు. ఇంద్రియనిగ్రహము కలవారు. సౌందర్యయుక్త శరీరాకృతి కలవారు. శివప్రసాద లబ్ధులు.

**21.** **సిద్ధ**: జితేంద్రియులు. సత్యపరాయణులు, గౌరవర్ణఛాయ కలిగియుందురు. ప్రత్యేక కార్యములందు నిష్ణాతులై యుందురు. కార్యసిద్ధి యోగం కలవారు.

**22.** **సాధ్య**: నీతిపరులు, చతురులు, హాస్యము నెరపెదరు. సకార్య సాధనాదక్షత కలవారు. శత్రువులను జయించెదరు. శు భమంత్రాచరణ శీలురు. విద్యయే ధ్యేయంగా కలిగి వుంటారు.

**23.** **శుభ**: శుభములనే ప్రచారము చేయుదురు. శుభములనే పలికె దరు. శుభులకు కర్తగా నుందురు. శుభములనుపదేశించును. శుభలక్షణ సమద్వితులు.

**24. శుక్ల**: ఇంద్రియ నిగ్రహము కలవారు. సత్యవాక్పరిపాలకులు. మతాశక్తి, కాంతివంతులు. వాగ్వాదములయందు, యుద్ధముల యందు జయము కలవారు. సన్మానములన్నా, తెల్లటి వస్త్రముల ధరించడమన్నా, చాలా ఇష్టం కలిగివుంటారు.

**25. బ్రహ్మ**: విద్యాధ్యయనవే ధ్యేయంగా కలిగివుంటారు. సదాచారాభిలాషజ్ఞులు. శాంతి స్వభావులు, వేదాంతదులు, నియమిత ఆచార ప్రియులు.

**26. ఐంద్ర**: ప్రజ్ఞావంతులు, బలిష్ఠులు, విశేషధన సంపన్నులు, కఫప్రకృతి కలిగియుందురు. శక్తిసంపన్నులు, స్వకీయ వంశమందు రాజసమానులుగా నుందురు.

**27. వైధృతి**: కుటిల స్వభావులు. చపలచిత్తులు. దుర్జన సాంగత్యం కలిగియుందురు. శాస్త్రాధారణ యందు విముఖులు. మనో వికృతము కలిగియుందురు.

**కరణము:** తిథిలో సగభాగము కరణము. ఈ లెక్కన నెలలో 30 తిథులకు మొత్తం 60 కరణములుంటాయి. ఎంచుకున్న వాటి తిథి ఆధారంగా నిర్ణీత సమయానికి ఏ కరణం నడుస్తుందో ఇప్పుడు తెలుసుకుందాం.

## కృష్ణపక్ష తిథులలో కరణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| **పాఢ్యమి** | : | బాలవ (మొదటి సగం), | | కౌలవ (రెండవ సగం) | |
| **విదియ** | : | తైతుల | ,, | గరజి | ,, |
| **తదియ** | : | వణిజి | ,, | భద్ర (విష్టి) | ,, |
| **చవితి** | : | బవ | ,, | బాలవ | ,, |
| **పంచమి** | : | కౌలవ | ,, | తైతుల | ,, |
| **షష్ఠి** | : | గరజి | ,, | వణిజి | ,, |
| **సప్తమి** | : | భద్ర (విష్టి) | ,, | బవ | ,, |
| **అష్టమి** | : | బాలవ | ,, | కౌలవ | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| **నవమి** | : | తైతుల | ,, | గరజి ,, |
| **దశమి** | : | వణిజి | ,, | భద్ర (విష్టి) ,, |
| **ఏకాదశి** | : | బవ | ,, | బాలవ ,, |
| **ద్వాదశి** | : | కౌలవ | ,, | తైతుల ,, |
| **త్రయోదశి** | : | గరజి | ,, | వణిజి ,, |
| **చతుర్ధశి** | : | భద్ర (విష్టి) | ,, | శకుని ,, |
| **అమావాస్య** | : | చతుష్పాత్ | ,, | నాగవము ,, |

## శుక్లపక్ష తిథులలో కరణములు

| | | | | |
|---|---|---|---|---|
| **పాఢ్యమి** | : | కింస్తుఘ్నం (మొదటి సగం), | | బవ (రెండవ సగం) |
| **విదియ** | : | బాలవ | ,, | కౌలవ ,, |
| **తదియ** | : | తైతుల | ,, | గరజి ,, |
| **చవితి** | : | వణిజి | ,, | భద్ర (విష్టి) ,, |
| **పంచమి** | : | బవ | ,, | బాలవ ,, |
| **షష్ఠి** | : | కౌలవ | ,, | తైతుల ,, |
| **సప్తమి** | : | గరజి | ,, | వణిజి ,, |
| **అష్టమి** | : | భద్ర (విష్టి) | ,, | బవ ,, |
| **నవమి** | : | బాలవ | ,, | కౌలవ ,, |
| **దశమి** | : | తైతుల | ,, | గరజి ,, |
| **ఏకాదశి** | : | వణిజి | ,, | భద్ర (విష్టి) ,, |
| **ద్వాదశి** | : | బవ | ,, | బాలవ ,, |
| **త్రయోదశి** | : | కౌలవ | ,, | తైతుల ,, |
| **చతుర్ధశి** | : | గరజి | ,, | వణిజి ,, |
| **పౌర్ణమి** | : | భద్ర (విష్టి) | ,, | బవ ,, |

**ఉదా:** ది. 01-01-2020 నాడు సాయంత్రం గం.05-30 ని॥లకు కరణము గుర్తించుట.

31 డిసెంబర్–2019 సాయంత్రం గం.04–02 ని॥ల నుండి 01 జనవరి–2020 సాయంత్రం గం. 06–27 ని॥ల వరకు శుక్ల షష్ఠి తిథి వుంది. 01–01–2020 నాటి ఉదయం గం. 05–14 నుండి (అనగా మంగళవారం రాత్రి తెల్లవారు జామున గం.05–14 ని॥లు) శుక్ల పంచమి రెండవ భాగం జరుగుతుంది. కనుక అప్పటి కరణము తైతుల (తైతిల).

ఆయా కరణముల యందు ఏయే పనులు చేపట్టవచ్చు? ఏయే పనులు చేపట్ట కూడదు? ఆయా కరణముల యందు జన్మించిన వారి లక్షణములు ఎలా వుంటాయి? మొదలైన వివరములు ఇప్పుడు తెలుసుకుందాం.

## కరణములు చేయతగిన పనులు

**స్థిరకరణములు:**

**1.** **బవ:** శుభకార్యములు, ధర్మకార్యములు, పుష్టిని కలిగించే పనులు, వాణిజ్యము, పశుసంబంధమైన పనులు, ధాన్య సంబంధమైన పనులు, తాత్కాలికమైన, స్థిరమైన పనులు, శ్రౌతస్మార్తాది కర్మలు చేయవచ్చును.

**2.** **బాలవ:** స్నేహమునకు, ధర్మకార్యములకు, బ్రాహ్మణులకు హితము కలిగించు పనులు, మంగళకృత్యములు, ఉత్సవములు, అన్నప్రాశనాదులు, వాస్తుక్రియలు, రాజ్యాభిషేకములు, యుద్ధక్రియలు చేయవచ్చును.

**3.** **కౌలవ:** కన్యా నిర్ణయము, శుభకార్యములకు, స్నేహానికి మంచిది. అలాగే బాలవకు పేర్కొన్న కార్యక్రమములకు మంచిది. ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱములకు సంబంధించిన పనులు (ప్రస్తుత కాలంలో ప్రయాణ, యుద్ధ వాహనములు మాత్రమే రవాణా వాహనములు కాదు), ఉపనయనము, అడవులు పెంచుట, నరకుట వంటి పనులు చేయవచ్చును.

4. **తైతుల:** సౌభాగ్యములకు, ముఖ్యులను కలియుటకు, గృహసంబంధమైన పనులకు, తోటపనులకు, విగ్రహ పనులకు, క్రయ, విక్రయములకు, యాత్రలు చేయుటకు, బావులు, చెఱువులు త్రవ్వుటకు మంచిది.

5. **గరజి:** కృషి, భోజవాపనం, గృహావరణలో విత్తనములు నాటుటకు, ప్రాకారములు కట్టుటకు, వ్యవసాయ-జలసంబంధమైన పనులు చేపట్టవచ్చును.

6. **వణజి:** స్థిరకార్యములకు, వ్యాపారములకు, ఇతరులతో కలసిమెలసి వుండుటకు, ధాతుక్రియలకు మంచిది.

7. **భద్ర (విష్టి):** అశుభ కార్యములకు, మంత్రం, శత్రునాశనం, విషప్రయోగం, దహనం, వథ, బంధన, అగ్నిచేధన, ఉచ్చాటనలకు మేలైనది. దున్నపోతులు, ఒంటెలకు సంబంధించిన పనులు చేపట్టవచ్చును. మంగళకర్మలు చేయరాదు.

**అస్థిరకరణములు:**

1. **శకుని:** ఓషధులు గ్రహించుటకు, వ్యాధి నివారణ, ఔషధములు తెచ్చుటకు, మారుటకు, మంత్రసాధనకు, మంత్రోపదేశమునకు, పౌష్టిక క్రియలకు, ఔషధసేవకు, గోసంబంధ క్రియలు చేపట్టుటకు మంచిది.

2. **చతుష్పాత్:** గోసంబంధ పనులు చేయుటకు, పితృదేవతలకు సంబంధించిన పనులకు, బ్రాహ్మణులకు దానమిచ్చుటకు, దానములు తీసికొనుటకు, రాజకార్యములు చేయుటకు అనుకూలము.

3. **నాగవము:** దారుణ కర్మలకు, ఇతరులకు అపకారము చేయుటకు పరధనము, పరస్త్రీ దోచుకొనుటకు, అందరికీ ద్వేషము కలిగించు పనులు చేపట్టుటకు మేలైనది.

4. **కింస్తుఘ్నం:** శుభకర్మలకు, పుత్రకామ్యాది యజ్ఞకర్మలు

చేయుటకు, శరీరపోషణకు సంబంధించిన పనులు చేయుటకు, వివాహాది శుభకార్యములు చేయుటకు, సిద్ధి కార్యములకు ఇది ఉపయుక్తము.

**పార్యాంతం:** బవ, బాలవ, కౌలవ, గరజి, వణజి కర్మలు ఐదు శుభములు.

## కరణములు - జనన ఫలితములు

1. **బవ:** కాముకులు, దయాస్వరూపులు, దృఢగాత్రులు, భాగ్యాపేతులు, యుక్తాయుక్త జ్ఞానదీప్తులు, శ్రీఘ్రగమనము కలవారు, భాగ్యవంతులు, నానావిధ ఐశ్వర్య సంపన్నులు.
2. **బాలవ:** అతిబలవంతులు, శౌర్యవంతులు, విలాసాతిశయము కలవారు, కవులు, దానశీలురు, విమల మతిమంతులు, కళాభిరుచిర ప్రధానులు.
3. **కౌలవ:** కాముకులు, ప్రగల్భాలాపనలు కలవారు, బహుమిత్రులు కలవారు, స్వతంత్ర జీవనము కలవారు, బలాఢ్యులు, మృదుతర వాక్కులు కలవారు, స్వకుల శ్రేష్ఠులు.
4. **తైతుల:** మిగుల మృదుతర శరీరులు, కళావిలాసాభి ప్రవృత్త చిత్తులు, కళాభినివేశము కలవారు, అతికోమల విలాస వాక్ సంపన్నత ఎరిగినవారు, సౌశీల్యవంతులు, పవిత్రాలోచనలు కలవారు, చంచల దృక్కులు కలవారు.
5. **గర:** పరోపకారులు, యుక్తాయుక్త విచారశీలరు, చతురులు, శత్రువులను జయించువారు, శూరులు, ధైర్యశాలురు, పరిపూర్ణ ఉదారులు.
6. **వణిజ (వణజి):** కళాప్రవీణులు, హాస్యముతో మెలగువారు, ప్రాజ్ఞులు, సన్మానములు పొందువారు, వ్యాపారీత్యా ధనాగమము కలవారు.

7. **విష్టి (భద్ర):** సుందర శరీరులు, చపల స్వభావులు, బలశాలురు, శత్రువులను జయించువారు, అధిక నిద్రమత్తులు, దుర్జనులు.

8. **శకుని:** మంత్ర విద్యాకుశలతలు ఎరిగినవారు, గుణగణ సమృద్ధులు, అతి సావధాన మనస్కులు, బహు అనుచరగణ యుక్తులు, శకునశాస్త్ర పారంగతులు, సౌభాగ్యవంతులు.

9. **చతుష్పాద:** ఆచారశీలరహితులు, సంపాదనాలేమితో బాధపడువారు, క్షీణించిన శరీరము కలవారు, పశుసంపదలు కలవారు.

10. **నాగవము:** దుష్ట స్వభావులు, వక్రనడత కలవారు, బలీయులు, దుష్టాత్ములు, కోపప్రకోపముచేత చెదిరిన మతికలవారు, కలహప్రియులు, కలద్రోహులు, కులక్షయ కారకులు, రణ రంగమున ధీరత్వము నెరపువారు.

11. **కింస్తుఘ్నము:** ధర్మాధర్మ విచక్షణము తెలియనివారు, మిత్రామిత్ర బేధము తెలియనివారు, బలదుర్భలాది విషయ పరిశీలనా రహితులు.

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు








# భువనేశ్వరీ పీఠం

## దేవీ నవరాత్ర మహోత్సవములు

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ శార్వరినామ సంవత్సర ఆశ్వీయుజ శుద్ధ పాఢ్యమి శనివారం అనగా తేది. **17-10-2020** నుండి శుద్ధ నవమి / దశమి అనగా తేది. **25-10-2020** ఆదివారం వరకు **దేవీ నవరాత్ర మహోత్సవములు** జరుగును.

ప్రతి రోజు ఉదయం **విఘ్నేశ్వర పూజ, పుణ్యాహవాచనం, మండపారాధనలు, అమ్మవారికి, అయ్యవారికి అభిషేకములు, అమ్మవారికి సహస్రనామ కుంకుమపూజ, శ్రీచక్రార్చన, నవచండీపారాయణ, చండీహవనము** జరుగును.

కావున పూజా కార్యక్రమాల్లో పాల్గొనే యావన్మంది భక్తులు ఈ క్రింది నెంబర్లను సంప్రదించగలరు.

సెల్ : **98661 93557, 99890 88557**

## భువనేశ్వరీ పీఠం

వర్ఝుల వారి వీధి, డోర్ నెం. 6-1-17,
ఐ.సి.ఐ.సి.ఐ. బ్యాంకు వద్ద, పెద్దాపురం-**533 437**
తూర్పు గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్